గాదె [3]బంటుఁబోలె గాంగేయ మృత్యువు
నీవశమున నిలిచె [4]నిర్భరముగ.

—: భీష్ముఁడు శరీరంబు విడిచి నాకలోకగతుం డగుట :—

నం. 13-169-46

468. వ. నీకు నే ననుజ్ఞయిచ్చితి వసువులం బొందు మనినం బరమానందంబునం బొంది పాండునందనులను ధృతరాష్ట్రునిం దక్కటి[1]వారలనుం గనుం గొని మీచేత ననుజ్ఞాతుండన కదా యని పలికియ౦దఱుం[2]గౌఁగిలించు[3]కొని యానృశంస్యం బును సత్యంబును నిత్యంబులుగాఁ బాటించి బ్రదుకుం డని చెప్పి తాను దొల్లి రాజుల గెల్చి తెచ్చినధనంబులు విప్రజనంబుల కిచ్చి ధర్మతనయుం జూచి యెల్లబ్రాహ్మణులనుం బూజనీయులు [4]ఋత్విజులు నాచార్యులు వృద్ధులు విశేషించి పూజింపవలయువా రని నిర్దేశించి యూరకుండి [5]ధారణానుక్రమం బున [6]సమాహితాత్ముం డయి వాయువుల సన్నిరుద్ధంబు చేసిన నవి యూర్ధ్వ గతింగై కొనియె నమ్మహాత్ముం డవయవంబులం బ్రాణంబులు వాపికొనుచు వచ్చునయ్యె[7]చోట్లు శల్యరహితంబు లగుచుండె న ట్లగుటం గాంచి కృష్ణాదు లగునఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణు లగుచుఁ గీర్తించి రాసంయమ చతురునిచే [8]సర్వాయతనసన్నిరుద్ధం బై యాత్మమూర్ధంబు భేదించి మహో ల్కాకారంబున నాకసంబునకెగసి కొంతద వ్వరిగి [9]యంత నంతర్హితం బయ్యె నప్పుడు పుష్పవృష్టి గురిసె దేవదుందుభులు మొరసె నంబరంబున సిద్ధులు సాధ్యులుం బొగడుచుం బ్రమోదంబు నొంది రిట్లు దేవవ్రతుండు దివంబునకుం జనుటయు.

—: పరలోకగతుండైన భీష్మునకు నగ్నిసంస్కారంబు చేయుట :—

నం 13-164-8

469. సీ. ధర్మపుత్త్రుండును దమ్ములు విదురయు
యుత్సులు [1]నగరుకాష్ఠోత్కరంబుఁ

---

3. బంధుపోలె - క.ల 4. నిర్మలాత్మ - అ ఉ ఔ. నిర్భయముగ - ఊ చ.

468 1. రాజులం - ఐ. ఖ. 2. గౌఁగిలించి దయానూనృతంబులు నిత్యంబులుగా - అ. ఈ. 3. కొని యామృశస్యంబును - ఓ. (అర్థము విచార్యము) 4. ఋత్విగాచార్య వృద్ధులవిశేషించి - పెక్కుప్రతులు. 5. వాయుధారణా - కొన్నిప్రతులు. 6. నముల్ల సితాత్ముండై - ఐ 7 చోట్ల - వా చోట్లు-పెక్కుప్రతులు 8. సర్వావయవతను సన్ని రుద్ధంబై - కొన్నిప్రతులు. 9 యంతరానంబునొందె - ఐ. ఔ. ఖ.

469. 1. నరిగి - కొన్నిప్రతులు

చందనదారుసంచయమును గొనిసమ
స్థలిసమంచితచితి యలఘుభంగి
విరచించి రయ్యుధిష్ఠిరుఁడును ధృతరాష్ట్రుఁ
డును నమ్మురున్నదీతనయుపుణ్య
గాత్రంబు సుస్నానకలితంబు విహితాను
లేపంబుఁ బుష్పదామోపశోభి

తే. తంబు [2]నుత్తమక్షౌ[3]మావృతంబు నుజ్జ్వ
లాభరణభూషితంబుఁగా నధికభక్తిఁ
జేసి రప్పుడు సామంబు సెలఁగ హోమ
మాచరించిరి యాజకు లగ్ని యలర.

470. క. కనకములు మణులు భూసుర
జన[1]సంఘంబున కజాతశత్రుఁడు శ్రద్ధా
వినయప్రీతియుతంబుగ
ననేకములు వేడ్క నొసఁగె [2]నవహితమతియై.

471. వ. తదనంతరంబ.

472. క. తలదిక్కు గవలుఁ [1]బాదం
బులదెస ధృతరాష్ట్ర పాండుభూపాగ్రతనూ
జులుఁ బట్టి యధికవిభవో
జ్జ్వల [2]మగు పాడెపయి నిడిరి [3]శవరత్నంబున్.

473. వ. అమ్మెయి నన్నలువురును వహించిరి భీమసేనార్జునులు ధవళచామరంబు [1]లిడిరి యుయుత్సుం డుత్తమచ్ఛత్త్రంబు వట్టె వృద్ధలగు కౌరవస్త్రీ లాలవట్టంబులు వట్టిరి ధౌమ్యుండు క్రియాకలాపంబు నడపె నట్లు సొద సేర్చి దేవవ్రతుని దేహంబు శ్రౌతాగ్ని కాహుతిచేసి [2]లోహకుండంబు లెత్తి ఘృతంబు

---

2. నుజ్జ్వల క్షౌమవంతంబును - ఐ. ఖ. 3. వస్త్రావృతంబును, క్షౌమపీతంబును - అని పాఠములు

470. 1 సంచయముల - ఐ. ఖ 2 నాహితమతియై-ఐ. ఖ ల; నాయతమతియై - ట.

472. 1. బాదంబున - శ. వ (ప్రాసభంగము) 2. తవిమానము న - ఉ. 3. శబ కొన్ని ప్రతులు (వైరిసమాసము)

473. 1. లుదాల్చిరి - ఉ ట; లుపివ - క. 2. స్వర్ణ - ఉ.

ప్రయోగించి ప్రజ్వలింపఁ జేసి రవ్విధంబునం బితృమేధంబు [3]విభవమహితంబును విధిసహితంబునుంగా ననుష్ఠించి యకౌరవు లపసవ్యంబుగాఁ దిరిగి కృష్ణద్వైపాయన నారదదేవల ప్రభృతు లనుగమింప భాగీరథికిం జని సర్వ భరత భార్యాసమేతంబుగా నగ్గాంగేయునకుఁ దిలోదక[4]ప్రదానంబు లాచరించి రట్టి సమయంబున.

—: పుత్రశోకాతుర యైన గంగాదేవి కృష్ణాదులం గనుంగొని దుఃఖించుట :-

సం. 18 - 154 - 18

**474.** సీ. [1]ఉదకంబు లందుండి యుత్థిత యై శోక
విహ్వలత్వంబున [2]వికలగమన
యగుచు నెమ్మోముపై నశ్రులు [3]గ్రమ్మఁ గాఁ
జనుదెంచి కౌరవసమితి [4]యెదుర
నిలిచి భాగీరథి యలఘుండు [5]తన కొడు
కిలఁ బరికింపఁగా నెట్టిభంగి
వాఁ డయ్యెఁ జరితంబు పోఁడిమి మీరెల్ల
నెఱుఁగుదు రైనను నేను గొంత

తే. చెప్ప వినుఁడు దృఢవ్రతశీలుఁ డమల
బుద్ధి రాజ[6]వృత్తాఢ్యుఁడు [7]భూరికృపుఁడు
కార్యసంవేది పితృభక్తిధుర్యుఁ డార్య
సమ్మతుండు విద్యాపరిశ్రమఘనుండు.

**475.** తే. కాశిరాజకన్యకలకుఁ [1]గాఁ జెనంగి
[2]వానిచే గాసి[3]యైరి భూవరులు పలువు
రంబ కై పూని [4]వాని [5]మహోబలంబు
జామదగ్న్యుండుఁ [6]దెరలువఁ జాల [7]కరిగె.

---

3. విభవసమాహితంబును - ల; విభవమహితంబుగాననుష్ఠించి - ఊ; 4. ప్రదానస్నానంబు లాచరించి - అ; కొన్నిప్రతులు.

474. 1. ఉదకంబునందుండి- అ ఇ. ఏ ఐ. ఖ 2 వివశగమన - ఎ 3 గ్రమ్మంగ జను దెంచి పెక్కుప్రతులు. 4. యందు - అ ఈ 5 నాకొడుకేఁ బరికింపఁ గనిట్టి - పెక్కుప్రతులు 6 నీతిజ్ఞుండు - ఊ. ఓ 7. భూరిబలుఁడు — అ. ఉ ఔ.

475. 1. గాఁగఁజెనఁగి - అ. ఏ. క ఖ ల 2. యతనిచేగాని యైరిభూపతులు-ఇ ఏ. ల. ఫ; వానిచేగానియై భూమివరులు ఓ 3. పడిరి - ఓ. 4. వచ్చిమహాబలుండు ఐ. ఔ. ఖ. 5. బాహా - కొన్నిప్రతులు-6. గదల పఙ - 7. దయ్యె - ప్.శ.ష. న. కొన్నిప్రతులు.

476. వ. అని విలాపంబు చేసి వెండియు.

477. తే. అంతవాఁడు శిఖండిచే నట్లు లగుట
గనియుఁ బెక్కులు పలికియు గాక యునికి
[1]కతనఁ జేసి వజ్రమయంబు గాఁగ నోపు
నని తలంచెద నా[2]డెంద మన్నలార.

478. వ. అని పలికిన గంగాదేవికి దేవకీనందనుం డిట్లనియె.

-: పుత్రమరణదుఃఖిత యగుగంగను కృష్ణద్వైపాయను లూఱడించుట :-

సం 13-164-26

479. తే. నీవు శోకంబు దక్కుము నీసుతుండు
పరమగతి[1]నొందె శాపసంప్రాప్తిఁ జేసి
వసువు మర్త్యుఁడై [2]వర్తించె నసదృశ ప్ర
భావుఁ డాతఁడు వగ పేల దేవి [3]నీకు.

480. చ. అతని శిఖండి యేల యమరాధిపుఁడున్ సమయింపఁ జాలునే
యతఁడు నిజేచ్ఛఁ జేసి నరునంచితదివ్యశరంబు లంగసం
[1]గతములు చేసి పొన్పుగ సుఖస్థితి మృత్యువు [2]మాన్చి యుండి కీ
ర్త్యతిశయ మొందె [3]తా వలచినప్పుడు పోయె విషాద మేటికిన్.

481. వ. అని యూఱడిలం బలికెఁ గృష్ణద్వైపాయనముని వరుండును బరమాదరణీయ త[1]త్త్వవచనంబుల [2]నజ్జాహ్నవీదేవికి నానందం బాపాదించెఁ దదనంతరంబ యాత్మీయసలిలసాంగత్యంబు నొందు నమ్మందాకినిచేతం గృష్ణాదులు నందఱు ననపతులును ననుజ్ఞాతులు నాశీర్వాద[3]ప్రీతులు నై మునులునుం దోడ నడవ నది వెడలి రని యిట్లు భీష్ముని వృత్తాంతంబు వైశంపాయనుండు జనమేజయునకుఁ జెప్పిన నప్పుడమితేఁ డిత్తెఱంగున నత్తాతకు వలయు [4]విధానం బాచరించి చరితార్థుండై నయపార్థివముఖ్యుండు మఱియెట్టి చందంబున బ్రవర్తించె మునీంద్రా యెఱింగింపవే [5]యని యడుగుటయు.

---

477. 1 కతమున ఘనవజ్ర - అ ఖ 2. చిత్తమన్నలార, మదియన్నలార - అనిపాఠములు.
479. 1 బొందె; ఇ ఈ. జెందె-ఓ 2. జనియించె, వసియించె - అనిపాఠములు. 3. మనకు - ఉ ఓ శ ష
480. 1 గతముగఁజేసి - అ. ఎ 2 గెల్చి, మాన్పి - అనిపాఠములు. 3. దాఁదలఁచి - ఫ. శ. ష. స.
481. 1. తత్త్వవచనంబుల - కొన్నిప్రతులు. 2. నద్దేవికి - పెక్కుప్రతులు. 3. ప్రీతులై - కొన్నిప్రతులు 4. విధానంబు లాచరించి - అ. ఇ. 5. యనుటయు - అ. ఉ. ఓ. శ.

482. చ. సకరుణదివ్యచిత్త [1]పరి [2]శాంతమహత్త్వ [3]విధాన [4]విత్తని
ర్వికృతి విలాసహృద్యశ్రుతి[5]విస్తర విస్ఫురదైకవేద్య పా
వకబహు[6]భవ్యనామ పరివర్ధన సంతయ[7]దూరధామ వి
[8]శ్వాకలిత[9]తోషణా సుభగసాత్యవతేయవచోవిభూషణా.

483. క. [1]సత్సేవ్యాచరణశమద
ద్వాత్సల్యాభరణ ధర్మతత్త్వోద్ధరణా
[2]హృత్సంగత భక్తికదురి
తోత్సారణధుర్య ధృఙ్మయూఖవిసరణా.

484. మాలిని. స్మయవిరహితపూజ్యా మంత్ర[1]గీతాధిరాజ్యా
నయనహిమగుసూర్యా నైష్ఠికశ్రేమధుర్యా
దయితభువనరక్షా [2]దాంతిసంపద్యరాక్షా
నియమనికటవర్తీ [3]నిష్కళానందమూర్తీ.

*గద్యము* :- ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున నానుశాసనిక పర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

శ్రీమదాంధ్రమహాభారతమునందలి యానుశాసనికపర్వము సమాప్తము.

→○←

---

482. 1. మతి – ఔ. 2. శాంతి – ఖ. చ. ళ. ప. 3. నిరాన – ఈ. 4. వృత్త – పెక్కుప్రతులు. 5. విస్తరిత, స్ఫురదైక–ఇ. ఒ. 6. దివ్యనామ–ఐ. ఖ. ల. పీ. ప. 7. కారిభూమ, కారిధూమ, భూరిధామ అనిపాఠములు. 8. శ్వైకపరిపోషణా – ఐ. ఔ. క. ఖ. ల. 9. పోషణా – పెక్కుప్రతులు

483. 1. సత్సేవ్యా చరణ సముద్వాత్సల్యా – స. 2. హృత్సంభవభక్తి – ఎ

484. 1. తంత్రాధిరాజ్యా – అ. ఈ. 2 దాంతి సంవిత్సమక్షా, దాంతి సంవత్సమక్షా, దాంతి సిద్ధ్యత్రపమోక్షా – స; దాంతి సేవత్సమక్షా, దాంతి హృద్యత్సమక్షా – అని పాఠములు. 3. నిర్మలా – ఇ. ఐ. ఖ.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి

## ఆ

## ఈ



## ఉ

## గ

## ద

## ఫ



## బ



## భ

## మ

## య



## ర

## హ